శ్రీ ర స్తు

హయగ్రీవాయనమః

# శ్రీ అమ్మవారి దం

ఇత్యాది

కాకినాడ నివాసియగు

గుండు జగన్నాథము అంతపన్నవారిచే

రచియింపఁబడి

రాజవరం శ్రీ మహీముద్రాక్షరశాల యందు

మల్లిడి సత్తిరెడ్డిగారిచే ముద్రింపఁబడి

గ్రంధకర్తచే ప్రచురింపఁబడియె.

24

1922



శ్రీరస్తు.

# శ్రీ అమ్మవారి దండకం.



శ్రీ మన్మహాదేవ దేవీ మహీమండలిన్ గా స మైయున్న యీదేవతా సార్వభౌమా మణిశ్రీమణీ లోకసంచారణీ భక్తచింతామణి దుష్టశిక్షామణీ మంజుభాషామణీ పాపసంహారిణీ పుణ్యసంచారిణీ ముక్తికాంతామణీ పావనీ నిన్నువర్ణింప బ్రహ్మాదిశేషుండును న్నోపగాలేని నేనెంతవాడన్ ధరన్ మున్ను యాదానవానీకదుర్మార్గులన్ బాపగా పెక్కురూపంబులన్ పెక్కునామంబులన్ నుద్భవంబందవేతొల్లి యింద్రాది లోకంబులన్ జేరితాజేయు కల్లోలమున్జూచి భీతాత్ములై యుండు పుణ్యాత్ములౌ దేవసం

ఘూంబులన్ ద్రుంపగాఁజూచి మాంసాది కానేక
శల్యాపురీషాదులున్ గల్గు కూపంబులన్ ద్రోయు
గా దేవతానీకమూభాదలన్ జిక్కి తాజేయునద్దే
దియున్ గానకో దేవి యోశాంభవీ శాంకరీ శ
ర్వ దుర్గాంబయోకంచి కామాక్షియో కాళి
యో పార్వతీ శంభురాణీ భవానీ సురాపూజి
తా దేవియంచున్ గడుందీనతన్ బొందిసిన్నా
ర్తులై వేదనాతారముఁన్ బొందియున్ పెక్కు
లాబాహువులన్ ఖడ్గశూలాద్యనేకాయుధాల్ బ
ట్టిఘూంకార మొప్పార క్రోధాగ్ని జ్వాలాప్ర
కాశంబుచే వెల్గుచున్ వచ్చునీమోము నుంగాం
చియీదానవానీక బృందంబులప్పప్ప యీరూప
మేనాము జూడంగలేదంచు యోతల్లి యోమా
త యోదేవిరక్షింపు రక్షింపుమంచున్ దగన్ వే
డుచున్నట్టి యవ్వారిసిన్ వీడి మహిషాసురున్
ద్రుంచి దేవాదులన్ గాచి రక్షించవా భూమి

గలోపంబులున్ నేత్రరోగంబులున్ త్సుత్తు
దుఃఖంబు లేకుండగా జేసి మాబిడ్డలన్ మాదు
పాత్రిళ్ళలో జేర్చుమీ జేర్చినన్ నీకుమాశక్తి
లోపంబు లేకుండగా పంప్లు పక్వాన్నముల్ భ
క్ష్య లేహ్యాంబులున్ పానకం బాదిగా దెచ్చి
నీకర్పితంబొప్పగా జేతుమో తల్లి దేవీ భవానీపా
ర్వతీ శంభురాణీ కృపాదృష్టిచే మమ్ము గాపా
డ నీకన్న మాకెవ్వరున్ వేల్పు లున్నారెనిన్
గొల్చి యేటేట నీయుత్సవం బాదిగా జాతరల్
జేసి తీర్థంబుగావించి యానందమున్ బొందు
చున్ నుండ మాయందు నీకింత క్రోధంబు గ
ల్గంగ మాచేయు లోపంబు లేమైననున్ నుం
డినే నుండినన్ మాతనైగాచి రక్షింపరాద
సురానీకమున్ జూచుచుండాస మమ్మొప్పుమున్
జూడరాదె మాయాపదల్ బాపి కాపాడుచున్
పంటయున్ పాడియున్ సంపదైశ్వర్యమున్ ని

చ్చి బ్రోవంగరాదె యటంచున్ వడిన్ నిన్న
యీరీతి స్తోత్రంబునన్ జేయునీపాదభక్తుండునీ
దాసదాసానదాసుండు కాకాపురీవాసుఁడున్ వై
శ్యుఁడున్ గుండువంశాబ్ధిసోముండనన్ జెల్లు స
ర్వేశనామాఖ్యునిన్ పుత్రుఁడున్ నార్యభక్తుం
డునై యొప్పుభూమిం జగన్నాధ దాసుఁడున్
గొల్వఁగా దండకంబొప్పగా వ్రాసి నీకంకితమం
దొకర్ల ప్రాదంపగా నుండగానెంచి, నీకర్పితం
బొప్పుగాఁ జేసె మామొఱ్ఱలాలించి మాపిల్లలం
గాచి మా పాపదల్ద్రిప్పి మాబిడ్డలుంబాందు
నీతాపముల్ బాపి రక్షింపుమా తల్లివై చూపు
మాదాతవై బ్రోవుమా తండ్రివై గావుమా నే
తవై గాంచుమా దేవివై బ్రోవు మాయమ్మ
నూకాంబతల్లీ మహాంకాళి దేవీ సురాపూజ
వల్లీ మహామ్మారి కాళీ భవానీ విశాలాక్షి
యోకంచికామాక్షి యోశాంభవి శాంకరీపా

ర్వతీ యన్నపూర్ణా మహాదేవి మీకందఱున్నేక
భావంబుతో మమ్మురక్షింపుడీ బ్రాహ్మణుల్
క్షత్రియుల్ వైశ్యులున్ శూద్రసంఘంబులున్
మీదు[illegible]ంబులన్ మానసంబందు శాభక్తి
తోసల్పు స్తోత్రంబులన్ జేయునవ్వారికిన్ గాక
యీదండకంబెప్పుడున్ భక్తి చేపల్కు నవ్వారి
కిన్ శ్రద్ధచేవ్రాయునవ్వారికిన్ పాపముల్ బా
పియున్ మోక్షమున్ గల్గజేయు నేగోలిన
నాదువాక్యంబు సందుంపు లోపంబులన్ నాథ
క్షేత్రవాద్దు సీదాసునిన్ గాచి రక్షించుమీ లో
కమాతా నమస్తే నమస్తే నమస్తే నమః



